# బ్రహ్మవిష్ణువులు సృష్టిని చేయుట

# అథ త్రయోదశోధ్యాయః

బ్రహ్మవిష్ణువులు సృష్టిని చేయుట

ఋషయు ఊచుః |

భవతా కథితా సృష్టిర్భవస్య పరమాత్మనః | చతుర్ముఖముఖాత్తస్య సంశయో నః ప్రజాయతే|| 1

దేవశ్రేష్ఠో విరూపాక్షో దీప్తశ్శూలధరో హరః | కాలాత్మా భగవాన్ రుద్రః కపర్ది నీలలోహితః || 2

సబ్రహ్మకమిదం లోకంస విష్ణుమపి పావకమ్ | యస్సంహరతి సంక్రుద్ధో యుగాంతే సముపస్థితే || 3

యస్య బ్రహ్మ చ విష్ణుశ్చ ప్రణామం కురుతే భయాత్ | లోకసంకోచకస్యాస్య యస్య తౌ వశవర్తినౌ || 4

యో%యం దేవస్స్వకాదంగాద్ర్బహ్మవిష్ణూ పురాసృజత్ | స ఏవ హి తయోర్నిత్యం యోగక్షేమకరః ప్రభుః || 5

స కథం భగవాన్ రుద్ర ఆదిదేవః పురాతనః | పుత్రత్వమగమచ్ఛంభుర్ర్బహ్మణో%వ్యక్తజన్మనః || 6

ప్రజాపతిశ్చ విష్ణుశ్చ రుద్రస్యేతౌ పరస్పరమ్ | సృష్టౌ పరస్పరస్యాంగాదితి ప్రాగపి శుశ్రుమ || 7

కథం పునరశేషాణాం భూతానాం హేతుభూతయోః | గుణప్రధానభావేన ప్రాదుర్భావః పరస్పరాత్ || 8

నాదృష్టం భవతా కించిన్నాశ్రుతం చ కథంచన | భగవచ్ఛిష్యభూతేన భవతా సకలం స్మృతమ్ || 9

తత్త్వం వద యథా బ్రహ్మామునీనామవదద్విభుః | వయం శ్రద్ధాలవస్తాత శ్రోతుమీశ్వరసద్యశః || 10

ఋషులు ఇట్లు పలికిరి -

పరమాత్మయగు శివుడు నాల్గు మోముల వేల్పు (బ్రహ్మ) ద్వారా చేసిన సృష్టిని గురించి నీవు మాకు చెప్పియుంటివి. దాని విషయములో మాకు ఒక సందేహము కలుగుచున్నది (1). దేవతలలో శ్రేష్ఠుడు, ముక్కంటి, ప్రకాశస్వరూపుడు, శూలమును ధరించినవాడు, పాపములను పోగొట్టువాడు, కాలస్వరూపుడు, జటాజూటమును ధరించినవాడు, కంఠమునందు నీలవర్ణమును మిగిలిన దేహమునందు ఎర్రని రంగును కలిగియున్నవాడు అగు రుద్రభగవానుడు (2) ప్రళయకాలము సంప్రాప్తము కాగానే అతిశయించిన కోపము గలవాడై, బ్రహ్మవిష్ణువులతో మరియు అగ్నితో సహా ఈ లోకమును ఉపసంహరించును (3). ఆయనకు భయపడి బ్రహ్మవిష్ణువులు నమస్కారమును చేయుదురు. లోకములను ఉపసంహరించే ఈ శివునకు వారు వశవర్తులై యుందురు (4). అట్టి ఈ రుద్రదేవుడు తన శరీరమునుండి పూర్వము బ్రహ్మవిష్ణువులను సృష్టించెను. ఆ ప్రభువే నిత్యము వారిద్దరి యోగక్షేమములను (లేనిదానిని సంపాదించుట యోగము, ఉన్నదానిని పరిరక్షించుట క్షేమము) చూచుచున్నాడు (5). ఆదిదేవుడు, సనాతనుడు, మంగళకరుడు అగు అట్టి ఆ రుద్రభగవానుడు అవ్యక్తమునుండి పుట్టిన బ్రహ్మకు పుత్రుడు అగుట ఎట్లు సంభవము? (6) బ్రహ్మవిష్ణువుల మరియు రుద్రుడు ఒకరినొకరు ఒకరి అంగమునుండి మరియొకరిని సృష్టించినారని కూడ పూర్వము వినియుంటిమి (7). సకలప్రాణులకు కారణములగు వీరిద్దరు ఒకరినుండి మరియొకరు పుట్టుట, అనగా ఒకరు పెద్ద మరియొకరు చిన్న అగుట ఎట్లు సంభవము? (8) నీవు చూడనిది, విననిది ఏదియు లేదు. భగవానుని శిష్యుడవగు నీకు సర్వము స్మృతియందు ఉండును (9). అట్టి నీవు

బ్రహ్మదేవుడు మునులకు బోధించిన విధముగా మాకు కూడ చెప్పుము. ఓ తండ్రీ! శ్రద్ధావంతులమగు మేము ఈశ్వరుని పుణ్యకీర్తిని వినగోరుచున్నాము (10).

వాయురువాచ |

స్థానే పృష్టమిదం విప్రా భవద్భిః ప్రశ్నకోవిదైః | ఇదమేవ పురా పృష్టో మమ ప్రాహ పితామహః || 11

తదహం సంప్రవక్ష్యామి యథా రుద్రసముద్భవః | యథా చ పునరుత్పత్తిర్బ్రహ్మవిష్ణ్వోః పరస్పరమ్ || 12

త్రయస్తే కారణాత్మానో జాతాస్సాక్షాన్మహేశ్వరాత్ | చరాచరస్య విశ్వస్య సర్గస్థిత్యంతహేతవః || 13

పరమైశ్వర్యసంయుక్తాః పరమేశ్వరభావితాః | తచ్ఛక్త్యధిష్ఠితా నిత్యం తత్కార్యకరణక్షమాః || 14

పిత్రా నియమితాః పూర్వం త్రయోఽపి త్రిషు కర్మసు | బ్రహ్మా సర్గే హరిస్త్రాణే రుద్రస్సంహరణే తథా || 15

తథాప్యన్యోన్యమాత్సర్యాదన్యోన్యాతిశయాశినః | తపసా తోషయిత్వా స్వం పితరం పరమేశ్వరమ్ || 16

లబ్ధ్వా సర్వాత్మనా తస్య ప్రసాదాత్పరమేష్ఠినః | బ్రహ్మనారాయణౌ పూర్వం రుద్రః కల్పాంతరేఽసృజత్ || 17

కల్పాంతరే పునర్బ్రహ్మా రుద్రవిష్ణూ జగన్మయః | విష్ణుశ్చ భగవాన్ రుద్రం బ్రహ్మాణమసృజత్పునః || 18

నారాయణం పునర్బ్రహ్మా బ్రహ్మాణం చ పునర్భవః | ఏవం కల్పేషు కల్పేషు బ్రహ్మవిష్ణుమహేశ్వరాః || 19

పరస్పరేణ జాయంతే పరస్పరహితైషిణః |
తత్తత్కల్పాంతవృత్తాంతమధికృత్య మహర్షిభిః || 20

ప్రభావః కథ్యతే తేషాం పరస్పరసముద్భవాత్ | శృణు తేషాం కథాం
చిత్రాం పుణ్యాం పాపప్రమోచినీమ్ || 21

వాయువు ఇట్లు పలికెను -

ఓ బ్రాహ్మణులారా! ప్రశ్నను వేయుటలో పండితులగు మీరు చాల చక్కని ప్రశ్నను వేసితిరి. పూర్వము ఇదే ప్రశ్నను నేను బ్రహ్మగారిని అడుగగా, ఆయన నాకు చెప్పియున్నాడు (11). దానిని మీకు చక్కగా చెప్పెదను. రుద్రుడు పుట్టిన విధమును, బ్రహ్మవిష్ణువులు ఒకరినుండి మరియొకరు మరల జన్మించిన విధమును చెప్పెదను (12). జగత్కారణ స్వరూపులగు ఈ ముగ్గురు సాక్షాత్తుగా మహేశ్వరునినుండి జన్మించినారు. వారు క్రమముగా చరాచరజగత్తు యొక్క సృష్టిస్థితిలయములకు కారణభూతులు (13). పరమేశ్వరునిచే అనుగ్రహించబడిన వీరు సర్వోత్కృష్టమగు ఐశ్వర్యముతో కూడియున్నారు. ఆ పరమేశ్వరుని శక్తితో నిండియున్న ఈ ముగ్గురు సర్వకాలములలో ఆ పరమేశ్వరుని కార్యమును చేయుటకు సమర్థులగుచున్నారు (14). వారి తండ్రియగు ఈశ్వరుడు పూర్వము వారిని ముగ్గురిని మూడు పనులయందు నియోగించినాడు. బ్రహ్మ సృష్టిని, విష్ణువు స్థితిని, రుద్రుడు సంహారమును చేయును (15). అయినప్పటికీ, వీరిలో ఒకరిపై నొకరికి ఈర్ష్య ఉండుట వలన, ఒకరిని మించి మరియొకరు ఉండువలెననే ఆశ ఉండుట వలన, వారు తమ తండ్రియుగు పరమేశ్వరుని తపస్సుతో సంతోషపెట్టరి (16). ఆ పరమేశ్వరుని అనుగ్రహమును పూర్ణముగా సంపాదించిన రుద్రుడు పూర్వము మరియొక్క కల్పములో బ్రహ్మను మరియు నారాయణుని సృష్టించెను (17). మరల ఇంకో కల్పములో జగత్స్వరూపుడగు బ్రహ్మ రుద్రవిష్ణువులను సృష్టించెను మరల విష్ణుభగవానుడు బ్రహ్మను మరియు రుద్రుని సృష్టించెను (18). మరల బ్రహ్మ నారాయణుని,

మరల రుద్రుడు బ్రహ్మను, ఈ విధముగా వివిధకల్పములలో బ్రహ్మవిష్ణుమహేశ్వరులు (19). ఒకరినుండి మరియొకరు పుట్టి, ఒకరి హితమును మరియొకరు చేయుచుందురు. మహర్షులు ఆయా కల్పముల మధ్యలో జరిగిన వృత్తాంతములను ఆధారముగా చేసుకొని, ఒకరినుండి మరియొకరు పుట్టే త్రిమూర్తుల ప్రభావమును చెప్పుచుందురు. విచిత్రమైనది, పవిత్రమైనది, పవిత్రమైనది, పాపములను పోగొట్టునది అగు వారి గాథను వినుము (20,21).

కల్పే తత్పురుషే వృత్తాం బ్రహ్మణః పరమేష్ఠినః | పురా నారాయణో నామ కల్పే వై మేఘవాహనే || 22

దివ్యం వర్షసహస్రం తు మేఘో భూత్వా% వహద్ధరామ్ | తస్య భావం సమాలక్ష్య విష్ణోర్విశ్వజగద్గురుః || 23

శర్వస్సర్వాత్మభావేన ప్రదదౌ శక్తిమవ్యయామ్ | శక్తిం లబ్ధ్వా తు సర్వాత్మా శివాత్సర్వేశ్వరాత్తదా || 24

ససర్జ భగవాన్ విష్ణుర్విశ్వం విశ్వసృజా సహ | విష్ణోస్తద్వైభవం దృష్ట్వా సృష్టస్తేన పితామహః || 25

ఈర్ష్యయా పరయా గ్రస్తః ప్రహసన్నిదమబ్రవీత్ | గచ్ఛ విష్ణో మయా జ్ఞాతం తవ సర్గస్య కారణమ్ |

ఆవయోరధికశ్చాస్తి స రుద్రో నాత్ర సంశయః || 26

తస్య దేవాధిదేవస్య ప్రసాదాత్పరమేష్ఠినః | స్రష్టాత్వం భగవానద్య పాలకః పరమార్థతః || 27

అహం చ తపసా %% రాధ్య రుద్రం త్రిదశనాయకమ్ | త్వయా సహ జగత్సర్వం స్రక్ష్యామ్యత్ర న సంశయః || 28

ఏవం విష్ణుముపాలంభ్య భగవానబ్జసంభవః | ఏవం విజ్ఞాపయామాస తపసా ప్రాప్య శంకరమ్ || 29

భగవన్ దేవదేవేశ విశ్వేశ్వర మహేశ్వర | తవ వామాంగజో విష్ణుర్దక్షిణాంగభవో హ్యాహమ్ || 30

మయా సహ జగత్సర్వం తథాప్యసృజదచ్యుతః | స మత్సరాదుపాలబ్ధస్త్వదాశ్రయబలాన్మయా || 31

మద్భావాన్నాధికస్తే!%తిభావస్త్వయి మహేశ్వరే | త్వత్త ఏవ సముత్పత్తిరావయోస్సదృశీ యతః || 32

తత్పురుషకల్పములో (?) సర్వజగత్కర్తయగు బ్రహ్మయొక్క వృత్తాంతమును వినుము. పూర్వము మేఘవాహనము అను పేరు గల కల్పములో నారాయణుడు (22) వేయి దివ్యసంవత్సరములు మేఘరూపమును దాల్చి భూమిపై వర్షించెను. ఆ విష్ణువు యొక్క అభిప్రాయమును గమనించి సమస్తజగత్తునకు తండ్రియగు (23) శివుడు సర్వము ఆత్మయనే భావముతో కూడియున్న వినాశములేని శక్తిని ఆయనకొసంగెను. అపుడు సర్వేశ్వరుడగు శివునినుండి శక్తిని పొందిన విష్ణుభగవానుడు సర్వమునకు ఆత్మభూతుడై, బ్రహ్మతో కలిసి జగత్తును సృష్టించెను. విష్ణువు యొక్క ఆ వైభవమును గాంచి ఆయన చేతనే సృష్టించబడిన బ్రహ్మ (24,25) పట్టరాని ఈర్ష్యతో నిండియున్నవాడై బిగ్గరగా నవ్వుతూ ఇట్లు పలికెను. ఓ విష్ణూ! పొమ్మ. నీవు సృష్టిని చేయుటకు గల కారణము నాకు తెలియును. ఆ రుద్రుడు మన ఇద్దరికంటె అధికుడనుటలో సందేహము లేదు (26). దేవతలకు అధీశ్వరుడు, సర్వజగత్కర్తయగు ఆ శివుని అనుగ్రహము వలన నీవీనాడు యథార్థముగా భగవానుడవై సర్వమును సృష్టించి పాలించుచున్నావు (27). నేను కూడా తపస్సుచే దేవదేవుడగు రుద్రుని ఆరాధించి, నీతో కూడి జగత్తును అంతనూ సృష్టించెదను. దీనిలో సందేహము లేదు (28). పద్మమునుండి పుట్టిన బ్రహ్మదేవుడు ఈ విధముగా విష్ణువును నిందించి, తపస్సుచే శంకరుని సాక్షాత్కరించుకొని, ఇట్లు విన్నవించెను (29). ఓ భగవాన్! దేవదేవా! ఈశ్వరా! విశ్వేశ్వరా! మహేశ్వరా! విష్ణువు నీ ఎడమభాగమునుండి పుట్టగా, నేను నీ కుడిభాగమునుండి పుట్టితిని గదా! (30) అయిననూ,

అచ్యుతుడు నాతో గూడి జగత్తునంతనూ సృష్టించినాడు. నిన్ను ఆశ్రయించగలననే ధైర్యముతో నేనాయనను ఈర్ష్యతో నిందించితిని (31). మహేశ్వరుడవగు నీయందు నాకు గల భక్తికంటె అధికమగు భక్తి ఆతనికి లేదు. కావున, మేమిద్దరము నీనుండియే ఉద్భవించియుండుటచే సమానమగు స్థాయిలో నున్నాము (32).

తస్య భక్త్యా యథా పూర్వం ప్రసాదం కృతవానసి | తథా మమాపి తత్సర్వం దాతుమర్హసి శంకర || 33

ఇతి విజ్ఞాపితస్తేన భగవాన్ భగనేత్రహా | న్యాయేన వై దదౌ సర్వం తస్యాపి స ఘృణానిధిః || 34

లబ్ధ్వైవమీశ్వరాదేవ బ్రహ్మా సర్వాత్మతాం క్షణాత్ | త్వరమాణో% థ సంగమ్య దదర్శ పురుషోత్తమమ్ || 35

క్షీరార్ణవాలయే శుభ్రే విమానే సూర్యసన్నిభే | హేమరత్నాన్వితే దివ్యే మనసా తేన నిర్మితే || 36

అనంతభోగశయ్యాయాం శయానం పంకజేక్షణమ్ | చతుర్భుజముదారాంగం సర్వాభరణభూషితమ్ || 37

శంఖచక్రధరం సౌమ్యం చంద్రబింబసమాననమ్ | శ్రీవత్సవక్షసం దేవం ప్రసన్నమధురస్మితమ్ || 38

ధరామృదుకరాంభోజస్పర్శరక్తపదాంబుజమ్ | క్షీరార్ణవామృతమివ శయానం యోగనిద్రయా || 39

తమసా కాలరుద్రాఖ్యం రజసా కనకాండజమ్ | సత్త్వేన సర్వగం విష్ణుం నిర్గుణత్వే మహేశ్వరమ్ || 40

తం దృష్ట్వా పురుషం బ్రహ్మా ప్రగల్భమిదమబ్రవీత్ | గ్రసామి త్వామహం విష్ణో త్వమాత్మానం యథా పురా || 41

ఓ శంకరా! పూర్వము వాని భక్తి వలన ఎటువంటి అనుగ్రహమును చూపియున్నావో, అదే విధమగు అనుగ్రహమును నాయందు కూడ చూపి, నాకు కూడ సర్వమును ఈయదగును (33). భగుని నేత్రములను పెరికిన దయానిధి యగు ఆ శంకరభగవానుడు ఈ విధముగా ఆయనచే విజ్ఞాపన చేయబడినవాడై, న్యాయముననుసరించి ఆయనకు కూడ సర్వమును ఇచ్చెను (34). బ్రహ్మ ఈ విధముగా ఈశ్వరునినుండియే సర్వాత్మభావమును పొంది, వేగముగా పయనించి క్షణకాలములో పురుషోత్తముడగు విష్ణువును చూచెను (35). పాలసముద్రము అనే నివాసములో స్వచ్ఛమైనది, సూర్యుని వలె ప్రకాశించునది, బంగారముతో మరియు రత్నములతో కూడియున్నది, దివ్యమైనది, ఆ విష్ణువుచే సంకల్పశక్తిచే నిర్మించబడినది ఆగు విమానములో (36) అంతములేని భోగహేతువు అగు శయ్యపై నిద్రించుచున్నవాడు, పద్మములను పోలిన కన్నులు గలవాడు, నాలుగు చేతులు గలవాడు, పుష్టియైన అవయవములు గలవాడు, సమస్తములగు ఆభరణములతో అలంకరింపబడినవాడు (37), శంఖచక్రములను ధరించి యున్నవాడు, ప్రసన్నమగు చంద్రబింబమును పోలిన మోము గలవాడు, శ్రీవత్సము అనే చిహ్నముతో కూడిన వక్షఃస్థలము గలవాడు, ప్రకాశస్వరూపుడు, ప్రసన్నము మరియు మధురము అగుచిరునవ్వు గలవాడు (38), భూదేవియొక్క సున్నితమైన పద్మములవంటి ఏతుల స్పర్శచే ఎర్రనైన పద్మములవంటి పాదములు గలవాడు, అమృతమువంటి పాలయొక్క సముద్రములో యోగనిద్రయందు విశ్రమించుచున్నవాడు (39). తమోగుణముచే కాలరుద్రుడు అనే పేరును పొందినవాడు, రజోగుణముచే హిరణ్యగర్భుడు అనబడువాడు, సత్త్వగుణముచే సర్వవ్యాపి, నిర్గుణస్థితిలో మహేశ్వరుడు, చైతన్యఘనుడు అగు ఆ విష్ణువును చూచి, బ్రహ్మ ప్రగల్భముగా నిట్లనెను. ఓ విష్ణూ! పూర్వము నీవు నాకు చేసిన విధముగనే, నిన్ను మ్రింగివేసెదను (40,41)

తస్య తద్వచనం శ్రుత్వా ప్రతిబుధ్య పితామహమ్ | ఉద్వైక్షత మహాబాహుస్స్మితమీషచ్చకార హ|| 42

తస్మిన్నవసరే విష్ణుర్గ్రస్తస్తేన మహాత్మనా | సృష్టశ్చ బ్రహ్మణా సద్యో భ్రువోర్మధ్యాదయత్నతః || 43

తస్మిన్నవసరే సాక్షాద్భగవానిందుభూషణః | శక్తిం తయోరపి ద్రష్టుమరూపో రూపమాస్థితః || 44

ప్రసాదమతులం కర్తుం పురా దత్తవరస్తయోః | ఆగచ్ఛత్తత్ర యత్రేమౌ బ్రహ్మనారాయణౌ స్థితా || 45

అథ తుష్టువతుర్దేవం ప్రీతౌ భీతౌ చ కౌతుకాత్ | ప్రణ   మతుశ్చ బహుశో బహుమానేన దూరతః || 46

భవో%పి భగవానేతావనుగృహ్య పినాకధృక్ | సాదరం పశ్యతోరేవ తయోరంతరధీయత || 47

ఇతి శ్రీశివమహాపురాణ    వాయవీయసంహితాయాం పూర్వభాగే బ్రహ్మవిష్ణువు సృష్టికథనం నామ త్రయోదశో%ధ్యాయః (13).

ఆ పితామహుని ఆ మాటను విని గొప్ప బాహువులు గల విష్ణువు నిద్రలేచి బ్రహ్మను చూచి చిరునవ్వు నవ్వెను (42). ఆ సమయములో మహాత్ముడగు బ్రహ్మ విష్ణువును మ్రింగి ప్రయత్నము లేకుండగనే కనుబొమల మధ్యనుండి వెంటనే మరల సృష్టించెను (43). అదే సమయములో రూపరహితుడు, పూర్వము వారిద్దరికి వరములనిచ్చినవాడు అగు భగవాన్ చంద్రశేఖరుడు వారిద్దరి శక్తిని చూచి సాటిలేని అనుగ్రహమును చేయుట కొరకై స్వయముగా రూపమును దాల్చి, బ్రహ్మవిష్ణువులు ఇద్దరు ఉన్న అచ్చోటికి విచ్చేసెను.(44, 45). తరువాత వారిద్దరు సంతోషించి, భయపడి ఆ దేవుని స్తుతించి, ఉత్కంఠతో మరియు ఆదరముతో దూరముగా నిలబడి పలుమార్లు నమస్కరించిరి (46). పినాకమనే ధనస్సును ధరించే శివభగవానుడు కూడ వారినిద్దరిని అనుగ్రహించి, వారిద్దరు సాదరముగా చూచుచుండగనే అంతర్ధానము చెందెను (47).

శ్రీశివమహాపురాణములోని వాయవీయసంహితయందు పూర్వభాగములో బ్రహ్మవిష్ణువులు సృష్టిని చేయుటను వర్ణించే పదమూడవ అధ్యాయము ముగిసినది (13).